# దుహితృ దౌహిత్ర విషయ శ్రాద్ధాధికార పౌర్వాపర్య పరిష్కారము.

తెనాలి సంస్కృత కాలేజీయందలి
సాహిత్యోపాధ్యాయుడు

ముదిగొండ నాగలింగ శాస్త్రి
రచితము.

మంజువాణీముద్రాక్షరశాల,

ఏలూరు.

1922

# ఉపోద్ఘాతము

విద్వన్మణులారా!

ఈనడుమ కృష్ణామండలమునందలి యేలూరు గ్రామ వాస్తవ్యులగు కొందఱు విప్రవర్యులు నాయొద్దకుఁ గొన్ని పత్రికల నంపియుండిరి. వానిలోఁ గొన్ని యచ్చుపత్రికలును, గొన్ని పండిత పత్రికలకు నకళ్ళును, తమయభిప్రాయమును దెలుపు పత్రికయుఁగలవు. వారంపిన లేఖయం దిట్లుండెను.

‘ అయ్యా ’ మాగ్రామమునఁ నొక బ్రాహ్మణ వితంతువు చనిపోయెను. ఆమెకు నిష్పతిసుతయగు నొక కొమార్తెయు దుహితృపుత్రుండగు నొక దౌహిత్రుండును గలరు. వీరిలోఁ గర్మాధికారులెవరని మాగ్రామమునఁ గొన్ని చర్చాసభలు జరిగినవి. అటు పైగ్రామాంతరములకుఁ దెలుపఁగా నానాపండితులు తమ యభిప్రాయముల వ్రాసి యనిపిరి. వాని నకళ్ళ నంపియున్నాము. వీనింగాంచి మీ యభిప్రాయంబును దెలుపఁ గోరుచున్నాము.” అని కలదు. అంత కడమ పత్రికలం గాంచఁగా వానిలో మహామహోపాధ్యాయ బ్ర. శ్రీ. తాతా సుబ్బరాయ శాస్త్రిగారువ్రాసిన పత్రికకు నకలును మీమాంసాధ్యాపకులు బ్ర. శ్రీ. గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు బ్ర. శ్రీ. నడిమింటి రామజోగి శాస్త్రిగారు ప్రభృతులగు విజయనగరం మహారాజావారి సంస్కృత కలాశాలా విద్వాంసుల పత్రికకు నకలును మఱియు ముద్రితములైన బ్ర. శి. వీ. పాక

యాజిగారు తీర్మానించిన పత్రికలును గనఁబడెను. వానిం బరిశీలింపఁగా మహామహోపాధ్యాయ బ్రి. శ్రీ. తాతా సుబ్బారాయశాస్త్రిగారు వ్రాసిన పత్రికలో నియమితుఁడో లేక ధనహారియో యగు దౌహిత్రునకు మాతామహకర్మాధికారము నిర్వివాదమనియు దౌహిత్రుఁడీ రెండు విధముల వాఁడును కానప్పుడు దుహితకే యధికారమనియు ధనభాక్త్వమును బట్టియె కర్త్రధికారము నిశ్చితమగుట సర్వధర్మశాస్త్ర కర్తల యభిప్రాయమనియుఁగలదు.

కాలేజీపండితుల పత్రికలో దుహితలేనప్పుడే దౌహిత్రుఁడు కర్మాధికారి యగుఁగాని దుహితయుండఁగా దౌహిత్రునకుఁ గర్మాధికార మెంతమాత్రము లేదని యను ధర్మశాస్త్రవచనములతో నిరూపింపఁబడియున్నది. అంత బ్ర. శ్రీ. వీ. పాకయాజిగారి యచ్చుపత్రికలంగాంచఁగా వివాదకారణము వాది ప్రతివాది న్యాయము, తమ యాధిపత్యము, తాము చేసిన విచారణ, తీర్పు ఇవియన్నియుఁ గానంబడియె. వారి తీర్మానము సారాంశము వినుఁడు.

మాతామహునిచే నియమితుఁడుగాకున్ననుసరే, ధనహారి కాకున్ననుసరే, దుహితయున్నను సరే. దౌహిత్రుఁడే కర్మాధికారియనియున్నది. ఇదియేమి? వింతగా నున్నది? పండితులయభిప్రాయమునకు వీరి యభిప్రాయమునకుఁ దేజస్తిమిరములకు బలెనే పరస్పర వైయధికరణ్యము తిరమగుచున్నది. ఇదియెట్లో ధర్మశాస్త్రములం బరిశీలించి చూతమని యెంచి యథామతి విమర్శింప నిట్లు తోఁచెను. ఏమి యీ చిత్రము? ధర్మశాస్త్రము లన్నియు దుహిత లేనప్పుడే దౌహిత్రునకుఁ గర్మాధికారము కలదనియు, కృతపుత్రికా పుత్రుఁడు గాని

ధనహారిగాని కాని దౌహిత్రునకుఁ గర్మాధికారమే లేదనియు నొక్క విధమున బోధించుచున్నవి. బ్రి. శి. వీ. పాకయాజి గారి బుద్ధి ధర్మమునెడ నెంత విపరీతముగఁ బ్రవర్తించెను! ఇంత దనుక శైవధర్మమునెడనే వైపరీత్యమును వహించి యున్నారని గ్రహింపఁ గలిగితిమి. ఇది చూడ నెల్ల ధర్మముల పట్ల విపరీత భావము వహించి యుండుట వారి స్వభావ గుణ మని స్పష్టమయ్యెడిని. అట్లు గాక పాండిత్యాశయముం బట్టి ధర్మశాస్త్రముల కట్టి రహస్యాభిప్రాయమును వారు గ్రహింపఁగలిగిరని యెంచుటకును మఱియాంతేవాసి వీరిని గూర్చి మీ కభిమానశాస్త్ర మెద్ది యని యడిగిన ప్రశ్నమునకు మా గురువుగారి కభిమానమే లేదు గాన ఆప్రశ్నకుబదులుచెప్పరని శిష్యుని పేరున వీరు వ్రాసినరిపోర్టు లేఖ యస్మన్నికటంబుననె యున్నదికదా? యని యెంచితి. అనంతర మిట్లు తోఁచెను.

వీరికిఁ దర్క వ్యాకరణాది శాస్త్రముల యందుఁ బ్రవేశము లేకున్నను ధర్మశాస్త్రముల పట్ల చాలవఱకు నభిమానము కలదు. ధర్మశాస్త్ర పారంగతులు కావుననే నిరభిమానముగ స్వమతి ధర్మములను గూడ నిర్మూలము చేయుచున్నవారు. అని చాలమంది వీరు చేయు ధర్మసంస్థాపనకుఁ బొంగి వీరిని బ్రహ్మరథము బట్టి యూరూర నూరేగించుచున్నారు. ఏపుట్టలో నేమి పామున్నదో? సత్తా లేదని తలంపరాదు. ధర్మశాస్త్రములకు వీరు చేసినవే సంప్రదాయ సిద్ధార్థములగునేమో? నా బుద్ధియే భ్రమించి యుండఁగూడదా? కావున మనకుఁ దోచిన భావంబు వెల్వరింతము. వారెట్లును మారకుండరని తెలిసిన యంశమే. కాని యొకటి గమనింపవలయు.

వీరు లోగడఁ బ్రకటించిన బహిరంగ లేఖలో ఎదిరి వాదమును గూడఁ దమ పత్త్రికలోఁ బ్రకటించి విమర్శింపఁగల మని వ్రాసియుండిరి. ఆ మాట మఱువక యట్లే ప్రకటించి క్రమముగా విమర్శింతురో లేక తమ యిచ్చవచ్చినట్లు బూ.. పంచాంగముతో పత్త్రిక నింపుకొందురో? ముద్రితమైనది కానఁ దమ పత్త్రికలోఁ బ్రకటింప ననవసర మని తప్పుకొనుటయు న్యాయ్యముకాదు. ఏలందురా? వీరి పత్త్రికలోని ధర్మ నిర్ణయ సభ యను శీర్షికను గాంచిన వారందఱు దానిపైని దగు పవిమర్శను జూచుట సంభవింపదు. దానిం గాంచినఁగాని యందుపై వారు గావించు మహో విమర్శము పాఠకులకు బోధపడనేరదు. ఉభయ వాదములు పూర్తిగాఁ బరిశీలించినం గాని న్యాయ్యా న్యాయ్యములను చదువరులు కనిపట్టఁజాలరు. కాఁబట్టి యిందగు విమర్శము నంతను తమ పత్త్రికయందుఁ బ్రకటించి క్రమముగా విమర్శింపక తీరదు. వారెట్లును సత్యసంధత్వమును ధర్మ శాస్త్ర పారంగతత్వమును నిలుపుకొనకుందురా? ఉండరు.

మఱియు వారితీర్మానములను ధర్మానురోధంబునఁ జేసిరో? లేక ద్రవ్యానురోధంబునఁ జేసిరో అదియును వ్యక్తమగు సమయమె కావున లోకులు జాగరూకులై యాచిగారు త్రొక్కఁబోవు దారినిబట్టి వారికందగు యోగ్యతాపత్త్రంబు నర్పింతురుగాక! ఇంక ధర్మజిజ్ఞాస కనుజ్ఞనొసంగుదురు గాక.

ఇట్లు

విద్వజ్జన విధేయుఁడు

సాహిత్యోపాధ్యాయుఁడు

ముదిగొండ నాగలింగశాస్త్రి

సంస్కృత కాలేజి,

తెనాలి.



శివాభ్యాం నమః.

# దుహితృ దౌహిత్ర విషయ
# శ్రాద్ధాధికార పౌర్వాపర్య పరిష్కారము

దుహిత, దౌహిత్రుడు వీరిద్దరిలో శ్రాద్ధాధికారము దుహిత లేకున్న దౌహిత్రునకు సంక్రమించునా? దౌహిత్రుడు లేకున్న దుహితకు సంక్రమించునా? వీరిలో నెవరు ప్రధానము? అనునది ప్రకృతవిచారణీయము.

### దౌహిత్రుని ప్రాధాన్యము గాని
### దౌహిత్రుడు లేనప్పుడే దుహితకు శ్రాద్ధాధికారము
### కలుగును అను వాదమునకు సాధకములు

1 వైద్యనాథదీక్షితీయ శ్రాద్ధకాండము. ([illegible] వ పేజీ) కేచిన్నేచ్ఛన్తి దుహితౄంశ్చైవ పత్నీనాం భ్రాతరస్తథా। ఇతి ధనగ్రహణే క్రమస్మరణాచ్చ పత్న్యాశ్చ దుహితుశ్చ దౌహిత్రాత్పూర్వభావిత్వమాగతం। పౌత్రా దౌహిత్రా నామంశా ఇతి విష్ణుస్మరణాత్ శిష్టాచారాచ్చ పత్నీ దుహితృపితృణాం దౌహిత్రస్య ప్రాధాన్య మపరేవదన్తి ఇతి- ధనగ్రహణవిషయమై మొదటిది భార్య, రెండవది కూతురు, తరువాతివాడు దౌహిత్రుడు గాని దౌహిత్రుని కన్న భార్యాదుహితలే ప్రధానమని కొందఱిమతమునకూ దించి దౌహిత్రులు పౌత్రతుల్యులని విష్ణుస్మృతిలో

నుండుటను శిష్టాచారమునుబట్టియు భార్యాదుహితలకంటె దౌహిత్రుఁడే ప్రధానమని సిద్ధాంతము చేయఁబడి యున్నది.

2 సుధీవిలోచనమునందు (౮౯ పేజీ) దౌహిత్రాభావపవ పత్న్యాః భర్తృదాహాది కర్తృత్వ మితి వివేకః తదభావే దుహితా ఇతి. దౌహిత్రుఁడు లేనప్పుఁడే భార్యకు భర్తృ దాహాది కర్తృత్వము కలదు. భార్యలేనప్పుడే దుహితకుఁ గర్తృత్వమనియుఁ జెప్పంబడి యున్నది.

ప్ర॥ శంఖః॥ పితుః పుత్రేణకర్తవ్యాః సిండదానోదకక్రియాః।
పుత్రాభావేతు పత్నిస్యా త్పత్న్యభావేతు సోదరః॥

ఈ వచనమున పుత్రుఁడు లేనపుడు భార్యకే కర్మాధి కార మని గలదు గాన దౌహిత్రుఁడు లేనప్పుడే పత్నికధి కార మను నిర్ణయము నిది యెట్లు బాధింపదు?

ఉ॥ సుధీవిలోచనమున 'పుత్రశబ్దోదౌహిత్రాంతవాచీ। పుత్రః పౌత్రః ప్రపౌత్రశ్చ పుత్రికా పుత్రపవచ॥' ఇతి పుత్రాది దౌహిత్రాంతస్య బద్ధక్రమత్వేన మధ్యేఽనవ కాశాచ్చ. ప్రపౌత్రుని జెప్పినపిమ్మట పుత్రికాపుత్రుఁడు పేర్కొనఁబడియె. వీరినెడమఁబత్నినిఁజేర్చు టెట్లు? కావున శంఖవచనములోని పుత్రశబ్దమునకు దౌహిత్రుని పర్యం తము నర్థము గ్రహింపవలయు. దీనింబట్టి దౌహిత్రు నకుఁ బిమ్మటనె పత్ని, తదభావముననే దుహిత యని యేర్పడుచున్నది.

ప్ర॥ పుత్రః పౌత్రః అనుచోట గ్రహింపఁబడిన పుత్రికా పుత్ర శబ్దము కృతపుత్రికాపుత్రుని బోధించును. కృత పుత్రికాపుత్రుడనఁ బురుషసంతతి లేనివాఁడు. కన్యాదా

నము చేయునపు డీమెయందు జనించినవాఁడు మన కిర్వు రకుం బుత్త్రుఁడు కావలెయునని యల్లుని నొడంబఱచి కన్యాదానము చేయఁగా నామెయందు జనించినవాఁడు కృతపుత్త్రికాపుత్త్రుఁ డనఁబరగు. దీనింబట్టి కృతపుత్త్రికా పుత్త్రునకే బత్నికంటెంబూర్వము ధనహారిత్వ కర్మ కర్తృత్వములు సంభవించుననియు- అకృతపుత్త్రికా పుత్త్రునకైననో పత్నీదుహితలు లేనపుడె కర్మాధికారమనియు నేల గ్రహింపఁగూడదు ?

ఉ॥ పుత్త్రికాపుత్త్ర శబ్దము నుభయపరముగనే గ్రహించుట న్యాయ్యము. మఱియు నీవిషయమై మనువిట్లు వచించి యున్నాఁడు. శ్లో॥ అకృతా వా కృతావాపి యంవిందేత్స దృశాత్సుతం । పౌత్త్రీమాతామహ స్తేన దద్యాత్పిండం హరేద్ధనం॥ అకృతపుత్త్రికగాని కృతపుత్త్రికగాని సజాతీయుఁడైన భర్తవలనఁ గనిన పుత్త్రునిచే మాతామహుఁడు పౌత్త్రుడు కలవాఁడగు. వాఁడె కర్మము చేయవలయు, ధనమునుగూడ గ్రహింపవలయు ననుటచే అకృతపుత్త్రికా పుత్త్రునకైనను పత్నీ దుహితలకంటెఁ బ్రాధాన్యము తప్పదు.

ప్ర॥ నాధనము గ్రహించి నాకుఁ గర్మముచేయుమని మాతామహుఁడు నియమించినప్పుడె దౌహిత్రునకుఁ గర్మాధికారమని యేల గ్రహింపఁగూడదు ?

ఉ॥ సుధీవిలోచనము (౮౯-పేజీ) మాతామహేనానియమిత స్యాపి దౌహిత్రస్య। పత్నీదుహితర శ్చైవేతి దుహిత్ర భావ ఏవ ధనభాక్త్వస్మరణాత్ పత్న్యాశ్చానంతరం స్పష్టా పుత్త్రభర్తృధనభాక్త్వం యుక్తం క్రియాకర్తృత్వంతు

దౌహిత్రస్యైవ దౌహిత్రాభావ ఏవ పత్న్యా భర్తృదాహాది కర్తృత్వమితివివేకః॥ మాతామహునకు నియమింపని వానికి దుహిత లేనప్పుడె ధనాధికారము వచ్చునుగాన పుత్రసంతానములేని విభక్తుండగు భర్తయొక్క ధనము పత్నియే చెందునుగాని దౌహిత్రునిఁ జెందదు. ధనము చెందనంత మాత్రమున దౌహిత్రునకుఁ గర్మాధికారము లేకపోదు. కర్మముమాత్రము దౌహిత్రుఁడే చేయవలయు. దౌహిత్రుఁడు లేనప్పుడేగాని పత్నికి దాహాది కర్మాధికారములేదు అని నిర్ణయింపఁబడి యున్నది. ఇట్లు దౌహిత్రుఁడుండఁగా పత్నికే కర్మాధికారము లేనప్పుడు పత్నికవ్వలదగు దుహితకుఁ గర్మాధికార మెక్కడిది?

ప్ర॥ ధనాధికారమును బట్టియే కర్మాధికారము సంక్రమించుచున్నది గాన ధనము దుహిత కనంతరమె దౌహిత్రునికని చెప్పంబడి యుండుటచేఁ గర్మాధికారంబును దుహితకవ్వలనే దౌహిత్రునకని యేల నిశ్చయింపఁగూడఁదు?

ఉ॥ కనఁబఱుపంబడిన సుధీవిలోచనముం బట్టియే ధనభాక్త్వమునకుఁ గర్మాధికారమునకు సంబంధములేదని యేర్పడుచున్నది. ఇది గాక వైద్యనాథీయ శ్రాద్ధకాండమునందు ధనగ్రహణాభావేపి దౌహిత్రోధికారీ॥ తథాభవిష్యత్పురాణే। యథావ్రతస్థోపిసుతః। కుర్యాత్పితృక్రియాంనృప। మాతామహస్యదాహాదా దౌహిత్రోపి తథార్హతి గృహ్యపరిశిష్టేపి॥ పితామహస్య తత్పత్న్యా మాతామహ్యాస్తథైవచ। పిండదానాదికం సర్వం మాతాపిత్రోస్సమం విదుః॥ దీనిం బట్టి ధనహారి కాకపోయినను దౌహిత్రుఁడు మాతామహాలకుఁ గర్మముచేయక తప్పదని ధ్వనిపడు

చున్నది. ఇట్లు వైద్యనాథదీక్షితీయము సుధీవిలోచనము నను నీ గ్రంథములు, సిరియుంటకున్నను జీడియుంటునను నట్లు ధనమంటకున్నను కర్మమంటితీరునని దౌహిత్రుని నిర్బంధించుచున్నవి.

ప్ర॥ ఈ గ్రంథములు ద్రావిడదేశమున కనుష్ఠాపక గ్రంథ ములు గాన నవి యీదేశస్థుల నెట్లు నిర్బంధించును ?

ఉ॥ శాస్త్రమన్ని దేశముల కొక్కటియె గాన నార్షవచనము లం బ్రమాణీకరించి వ్రాయఁబడిన ధర్మనిబంధన గ్రంథము ఈదేశమునకుఁ గాదని త్రోసివేయఁగునా? కూడదు గాన సంధునఁ కొప్పక విధిలేదు.

దుహితయె ప్రధానము గాన నామె లేనప్పుడె దౌహిత్రు నకుఁ గర్మాధికారమను వాదమునకు సాధకములు.

1 ధర్మసింధుసారమున ‘ దుహితురభావే దౌహిత్రో ధనహారీ పిండదశ్చ ’ దుహిత లేనప్పుడె దౌహిత్రుఁడు మాతామ హుల ధనమును గ్రహింపవలయు, కర్మము గూడఁజేయ వలయు నని చెప్పఁబడియున్నది. దీనింబట్టి కూఁతురు లేనప్పుడె దౌహిత్రుఁడు కర్మాధికారి యని యేర్పడు చున్నది.

ప్ర॥ ధర్మసింధువు నిర్ణయ గ్రంథముగాని స్వతంత్రస్మృతి కానేరదు. ఇది యెట్లు ప్రమాణమగును ?

ఉ॥ ధర్మసింధువు నిర్ణయగ్రంథమైనను ఆర్షవచనములచే నేర్ప డిన పర్యవసితార్థములను చెప్పినదిగానఁ బ్రమాణగ్రంథమేయగు. అట్లు గానిచో సుధీవిలోచనము వైద్యనాథీయము మున్నగునవి మాత్రమెట్లు ప్రమాణములగు ?

ప్ర॥ సుధీవిలోచనాదులయందుఁ జేయఁబడిన నిర్ణయములకు ఋషివచనములు మూలముగా గ్రహింపఁబడి యున్నవి. ధర్మసింధువునందట్లు మూలవచనములు గ్రహింపఁ బడి యుండలేదు. కావున "దుహితురభావే దౌహిత్రః" అను వచనము నిర్మూలము గాన నది గ్రాహ్యము కాదని యేల తలంపరాదు?

ఉ॥ ధర్మసింధువు నుపక్రమము నెఱుఁగవు కాఁబోలు? ఆరంభముననే, "దృష్ట్వాపూర్వనిబంధా న్నిర్ణయసింధుక్రమేణ సిద్ధార్థాన్ । ప్రాయేణమూలవచనాన్యుద్ధృత్య లిఖామి బాలబోధాయ॥ మూల వచనముల నుదాహరింపకయె నిర్ణయసింధ్వాది పూర్వ నిబంధన గ్రంథ కర్తలచే సిద్ధాంతము చేయఁబడిన యంశములను లిఖించెద నని గ్రంథ కర్త మొదట చెప్పుకొని యున్నాఁడు. ఇందు వ్రాయఁబడు నంశములు నిర్ణయ సింధ్వాదుల యందు సిద్ధాంతితములై యున్నవగుటను తిరుగ నిందు మూలవచనములతోఁ బని యేమి? నీ వా నిబంధన గ్రంథముల నవలోకింపక గ్రంథకర్త మొదలైన నాలింపక యతని వాక్యము నిర్మూలమనుట సాహసము కాదా?

ప్ర॥ పోనిమ్ము, సమూలమే యనుకొందము. దీనికి మేమర్థాంతరము చెప్పినది వినలేదు కాఁబోలు. 'దుహితురభావే దౌహిత్రో ధనహారీ పిండదశ్చ' పిండదుఁడైన దౌహిత్రుఁడు దుహిత లేనప్పుడే ధనహారి యగును. ఇట్లీ వాక్యము ధనహారిత్వమును మాత్రము విధించుచున్నది. కర్మాధికారమునైననో పూర్వ వాక్యమే విధించినది. ఏదన, 'జీవత్పితృకః స్వమాతుః అపుత్రసాపత్నమాతుః

స్వపుత్ర సపత్నీపుత్రరహిత భార్యాయా అపుత్ర పితృ
వ్యస్య అపుత్రమాతామహమాతామహ్యోశ్చ దౌహి
దిప్రేత కర్మాణి కుర్యాత్' అనువాక్యముచేతనే మాతా
మహీమాతామహులకు దౌహిత్రుఁడు కర్మము చేయ
వలయు నని యేర్పడుచున్నది. దీనిం బట్టి కర్మాధికార
ము దౌహిత్రునకే మొదట సంక్రమించునని యేర్పడు
టలేదా?

ఉ॥ ఆ వాక్యమునకు నీవుచెప్పినదర్థమే యగునేని నట్లేయగు.
దుహితుర్భావే అను వాక్యమునకు నీవు చెప్పిన దన
ర్థమే. కోపింపక వినుము. పిండదః అను పదము దౌహి
త్రునకు విశేషణము చేసితివి. 'చ' అను పదమున కేమి
యర్థము చెప్పితివి? పాదపూరణమున కని చెప్పుట కిది
పద్యమైనఁ గాదే. ఈ ప్రకరణము ధనహారి ప్రకరణమా?
శ్రాద్ధాధికారి ప్రకరణమా? అదృష్టవశమున నీకు ధన
హారి ప్రకరణ మయినది గాని దురదృష్టుఁడు దౌహిత్రు
న కట్టి భాగ్యము కలదా? అతనికి కేవలము శ్రాద్ధాధికా
రిప్రకరణమేగదా అయినది. ధనహారిమాత్ర మని యర్థ
ముచెప్పిన ప్రకరణ మెట్లు విరోధింపదు? 'పిండదః' అను
పదము దౌహిత్రునకు విశేషణ మగు నెడ దౌహిత్రపద
మునకుఁ బూర్వమే దానిని గ్రంథకర్త యేల ప్రయో
గింపఁడు? ధనహారిత్వము విధేయమగునెడ దాని యనం
తరము చెప్పంబడిన పిండదత్వంబును నేల విధేయము
కాదు? 'ధనహారీ పిండదశ్చ' అని విధేయముల వరుస
లోఁ జెప్పఁబడిన పిండదపదము ననువాదపరముగా నర్థ
ముచేయునెడ 'యత్ప్రియేశ్రూయతేయచ్చ తత్తాదృగ

వగమ్యతే ' యను ప్రాయ పాఠ విరోధ మెట్లుబాధింపదు? దుహిత లేనప్పుడే దౌహిత్రుఁడు ధనహారియు పిండ దుఁడు నగు నని ధనహారిత్వమును, పిండదత్వమును రెం డిటిని 'చ' శబ్దము చేత నిస్సంశయముగా సముచ్చయ ముచేసి విధించుచుండ, చ శబ్దమును విడిచిపెట్టి ప్రకరణ విరోధముగ ప్రాయపాఠవిరోధముగ నర్థముచేసిన నది నీ యందు గురుత్వముకలవారలకు నచ్చు వచ్చుగాని వ్యుత్ప న్నులకైననో యదిబీభత్సను గలిగింపకపోవునా?

జీవత్పితృకః అని మొదలిడిన వాక్యము దౌహిత్రు నకుఁ గర్మాధికారము విధించెను గాన నీ వాక్యంబును తిరిగి కర్మాధికారమునే విధించినఁ బునరుక్తమగు నని సంశయింతువా? వినుము.

"జీవత్పితృకః" అని మొదలగు వాక్యము జీవత్పితృక నిర్ణయమను పూర్వ ప్రకరణములోనిది. శ్రాద్ధాధికారి ప్రకరణమునఁ గర్మాధికారినిర్ణయమే ప్రకృతము. పుత్రాదులు లేనప్పుడు దౌహిత్రుఁడు కర్మాధికారి యని యేర్ప డును. అధికారియైనను దౌహిత్రుఁడు తండ్రియుండఁగా మాతామహునకుఁ గర్మము చేయనగునా? అను సంశ యము వారించుటకై జీవత్పితృకః అనిమొదలుగా తండ్రి యుండఁగా నెవరివఱకుఁ గర్మము చేయ నగునో అను నంశ మీ ప్రకరణమునఁ జెప్పఁబడినది. ఇచ్చటఁ బౌన రుక్త్యమున కవకాశ మెక్కడిది?

ఇదిగాక జీవత్పితృకః అను వాక్యము నీ కెంతమాత్ర ము సాధకముగాదు. తండ్రిమాత్రి మున్నవాఁడని చెప్ప టచే తల్లి లేనివాఁడని స్పష్టమగుచున్నది. దీనింబట్టియుం

దల్లి యుండునెడ నామెకే యధికారము గాని వీనికి లే దనుటసిద్ధము. కావున దుహిత లేనప్పుడే దౌహిత్రున కధికారమనుట నిర్వివాదము.

ప్ర॥ జీవత్పితృకుఁడు మాతామహునకు మాతామహికిని దాహాది ప్రేతకర్మలు చేయవలసిన దని ధర్మసింధుసారకర్త చెప్పియున్నాఁడు. అంతియ కాని తల్లిచనిపోయినయనంతరమే మాతామహాదులకుఁ గర్మము చేయవలయు నను నర్థము వచ్చు పదము నుపయోగింపలేదు. పూర్వమందుఁ గాని పరమందుఁగాని యీ యర్థము నిలిపెడి వాక్యము వ్రాసియుండలేదు. కానఁ దల్లి బ్రదికియుండఁగా మాతామహాదులకు దౌహిత్రుఁ డుత్తరక్రియలు చేయరాదను వాదము గ్రంథవిరుద్ధము, ధర్మవిరోధము, ఆచారప్రతికూలము నని యేల నిశ్చయము (తీర్పు) చేసికొనరాదు.

ఉ॥ గ్రంథవిరుద్ధమని వచించిన పదంపడి ధర్మవిరుద్ధమని పలుక శబ్దవైచిత్ర్యము రాదను నాశయముతో ధర్మవిరోధ మని పలికితివి కాఁబోలు : కాని యీపదము నీకుంగలజన్మాంతరీయశాబ్దసంస్కారమునే ధ్రువపఱచెడిని. పోనిమ్ము. ఇప్పు డర్థవిమర్శనమే ప్రకృతము. పూర్ణవిమర్శమునకుఁ గడంగిన వ్రాయ నలవి యగునా ? ప్రకృతము వినుము. ధర్మసింధువు లోని జీవత్పితృకః అను పదమునకుఁ దండ్రి మాత్రము బ్రతికియున్నవాఁడని యర్థము చెప్పునెడఁదల్లి లేనివాఁడని యర్థమగుట లేదా ?

ప్ర॥ అచ్చటి జీవత్పితృకపదమునకు నేను తల్లి దండ్రు లిద్దఱు గలవాఁడనియే అర్థము చెప్పుచున్నాను. అట్లేల గ్రహింపఁగూడదు? తల్లి చనిపోయిన తరువాతనే యను న

మును బోధించు పదము పూర్వమందుగాని పరమందు గాని కలదా ?

ఉ॥ అచ్చటి జీవత్పితృకః అను పదమునకు తల్లిదండ్రులు గల వాఁడనియె యర్థము చేయునెడ విశేషబాధకము కనఁబడదు. కాని జీవత్పితృకః స్వమాతుః అను వాక్యమునకు జీవత్పితృకః—తల్లిదండ్రులు గలవాఁడు, స్వమాతుః—తనతల్లికి "దాహాదిప్రేతకర్మాణి కుర్యాత్"—దాహాదిప్రేత కర్మలను జేయవలయునని కదా యర్థమగును. దీనింబట్టి నీవు బ్రతికియున్న తల్లికని దాహాది ప్రేతకర్మలు చేయించుచు నట్లు చేయనివానికి బహిష్కారాదుల విధింపనను వగును. కలిమహారాజు ధర్మశాస్త్రముల నెట్లుద్ధరించునా యను విచారము తొలఁగినది. ధర్మశాస్త్రములకు నీవిట్టి గురుసంప్రదాయ సిద్ధరహస్యార్థముల సాధించుచుఁ బత్రికాముఖంబునఁ బ్రకటించుచుండ నింకను ధర్మదేవత యొంటికాలుతోడనే కుంటుచుండునా ? తప్పక నాలుగు కాళ్ళం బరుగెత్తియె తీరును. ఈ విశేషార్థములం బత్రికాగ్రాహకులలో మీయెడ గౌరవము గలవారికే నిరంతర ముపదేశించుచుందుము. వారు బుద్ధిమంతులుగాన నేమి వ్రాసినను తప్పక సంతసింతురు.

ప్ర॥ అట్లేని ధర్మసింధుకార వచనము వైద్యనాథదీక్షితీయ సుధీవిలోచనములకు విరోధించినది గాన ప్రమాణము కానేరదు. ప్రమాదమూలమని యేల తలంపఁగూడదు ?

ఉ॥ ధర్మసింధువునకు విరోధించినవి గాన వైద్యనాథదీక్షితీయ సుధీవిలోచన వచనములే ప్రమాదకృతములని యేల నిశ్చయించుకొనరాదు ?

ఇది గాక వైద్యనాథదీక్షితీయ సుధీవిలోచనములు చోళదేశమున కనుష్ఠాన గ్రంథములు గాన మన కవి ముఖ్యములు గానేరవు.

ప్ర॥ శాస్త్ర మన్నిదేశములకు నొక్కటియే. వైద్యనాథదీక్షితీయాదు లార్షవచనముల నుదాహరించుచు వ్రాయఁబడి నవే. ఇట్టి ధర్మనిర్ణయగ్రంథము మన దేశమునకుఁగాదని త్రోసివైచుట న్యాయమా ?

ఉ॥ శాస్త్ర మన్నిదేశములకునొక్కటియే. వైద్యనాథీయాదు లార్షవచనముల నుదాహరించుచు వ్రాయఁబడినవె. అయి నను నిర్ణయగ్రంథకర్తలు తమ తమ దేశములయందున్న యాచారములకు వీలైనవఱకు మూలవచనముల సంపా దించి తమ తమ దేశాచారములఁ జాలవఱకు నుద్ధరించు కొనువారుక కలదు. ఎట్లన ద్రావిడదేశమున నీటిలో నుంచఁబడిన చల్దిని ప్రాతఃకాలమున భుజించువారుకయు, పులిహోర పెక్కుదినములదనుకదాచియునిచికొని భుజించు నలవాటును కలదు. వైద్యనాథదీక్షితుఁడు ద్రావిడ దేశస్థుఁడు గాన జలసంపర్కముగాని తైలసంపర్కముగాని కలిగియున్నయెడ అన్నమునకు పర్యుషితత్వదోషములేదని యార్షవచనములనే యుదాహరించియున్నాఁడు. పూర్వపు ఋషులలోనను మధ్యాహ్నముదనుక నుండజాలక నీటిలో నుంచఁబడియున్న చల్దినిఁ (తరవాణిని) భుజించువారును పులిహోరబుట్టలఁ జంకనిడికొని యాత్రలు సల్పువారును నుండి యుండనగు. కావుననే యార్షవచనంబులును నా యా దేశాచారములకును మతాచారములకును నను గుణ ముగనే దొరకుచున్నవి. దాననే సుధీవిలోచనకారుండును,

తన గ్రంథమున (౩౦౯ పేజీ) 'బ్రాహ్మణస్యోర్ధ్వ పుండ్రంస్యాత్ క్షత్రియస్యార్ధచంద్రకం। వైశ్యస్యవర్తులాకారం శూద్రస్యైనతి పుండ్రకం॥' అని మొదలుగా బ్రాహ్మణున కూర్ధ్వపుండ్రమనియు, శూద్రునకే త్రిపుండ్రమనియు, "లలాటెతిలకంద్రృష్ట్వేతి" వచనము వైశ్య విషయమనియు, సిద్ధాంతముచేసి యున్నాఁడు. దీనిం బట్టి యితండు వైష్ణవుండని స్పష్టమగుచున్నది. ఈ కారణములను బట్టి యేదేశస్థుఁడు ధర్మనిర్ణయ గ్రంథమును వ్రాయునో ఆ దేశమునందగు నాచారముల నభినూనించి వ్రాయును గాన నా గ్రంథ మా దేశమునకే ముఖ్య మని వ్యవహరింపఁబడుచున్నది. దీనిం బట్టియే వైద్యనాథ దీక్షితీయ సుధీవిలోచనములు దక్షిణదేశమున కనియు, నిర్ణయసింధు, ధర్మసింధు మున్నగునవి సర్వ దేశముల కనియునీవాదము నిష్కారణమైనది కానేరదు.

ప్ర॥ వైద్యనాథదీక్షితీయము శ్రాద్ధకాండమున (౨౫ పేజీ) కేచిత్పత్నీ దుహితరశ్చైవ పితరౌభ్రాతర స్తథా। ఇతిధన గ్రహణే క్రమస్మరణాత్ పత్న్యాదుహితుశ్చ దౌహిత్రాత్పూర్వ భావిత్వమాహుః। పౌత్రా దౌహిత్రకా మతా ఇతి విష్ణుస్మరణాత్ శిష్టాచారాచ్చపత్నీ దుహిత్రపేక్షయా దౌహిత్రస్యప్రాధాన్య మపరేవదన్తి॥ అని వచించియున్నాఁడు. ఇందు రెండవ మతమే గ్రంథకారుని దని తోఁచుచున్నది. దుహితురభావే దౌహిత్రః అను వాక్యము నిది బాధింపదా?

ఉ॥ వైద్యనాథదీక్షితీయమున ధనహారిత్వమునుబట్టి దుహితకనంతరమె దౌహిత్రుఁడని కొందఱును, శిష్టాచారమును

బట్టి దౌహిత్రుఁడె ప్రధానమని మఱికొందఱునని మత ద్వయ ముదాహరింపఁబడియున్నది. అచ్చటి దేశాచార ముంబట్టి రెండవమతము నుదాహరించెను. అంతియె గాని పూర్వవాదమునుఖండించియుండలేదు ‹‹పౌత్రాదౌ. హితౄణామతాః” అను విష్ణుస్మృతి యీవాదమునకు సాధ కముగాఁ గనుపఱచినాఁడుగాని యీవచన మావాదమున కంత సాధకము గానేరదు. ఏలన దౌహిత్రులు పౌత్త్రిలు అనఁగా పౌత్త్రితుల్యులని యేర్పడుచున్నది. దుహిత యైననో ‹ పుత్త్రేణదుహితాసమా ’ పుత్త్రినితో సము రాలని సుధీవిలోచనకారుఁడు మున్నగు పలువురు నిబం ధనకర్తలచే నిరూపింపఁబడియున్నది. కావున నీవిష్ణుస్మృతి దౌహిత్రునికన్న దుహితయె ప్రధానమను నర్థమునకే సాధకమగుచున్నది. దుహితకంటె దౌహిత్రుఁడు ప్రధా నమనుటకు వైద్యనాథుఁడు తగిన ప్రమాణమును కను పఱచియుండలేదు.

ప్ర॥ శిష్టాచారము కలదని చెప్పియున్నాఁడు. అదిదుర్లంఘ ముకాదా?

ఉ॥ అగును. శిష్టాచారమన ద్రావిడదేశపు శిష్టాచారమనియే గ్రహింప వలయు. లేనిచో నిచ్చటి శిష్టాచార ముభయ విధముగా నున్నది గాన దానిని బట్టి దౌహిత్రునికంటె దుహితకె ప్రాధాన్యము చెప్పనగును. శాస్త్రమునుబట్టి గాని శిష్టాచారమయినది కానిది నిర్ణయింప వలనుపడదు అదికనుపడుటలేదు. దౌహిత్రునిఁబ్రధానముగా గ్రహించు నాచారమునకుఁ గారణ మింకొకటి కనుపట్టెడిని పత్నికిఁ గాని- దుహితకుఁగాని కర్తృత్వము వచ్చినను వారి కర్తృ

త్వముమీాద నితరులేకర్మము చేయవలసి యుండుటచే వితరులకంటె దౌహిత్రుడేచేయుట యుక్తమను నాశయముతో పత్నీదుహితలున్నను దౌహిత్రునిచే చేయించు నాచారము కొన్నిచోట్ల నేర్పడియుండును. అంతమాత్రమున నీశిష్టాచారమునే ప్రమాణముగాఁ బెట్టికొని శాస్త్రము నుల్లఘించి దౌహిత్రునకే ప్రాధాన్యము శాస్త్రసిద్ధమని సిద్ధాంతముచేయుట న్యాయమెట్లగు? దుహితకంటె దౌహిత్రునకుఁ బ్రాధాన్యము విధించుపక్షము బహు శాస్త్రవిరుద్ధమని ముందు నేర్పడఁగలదు.

ప్ర॥ సుధీవిలోచనమునందు (౮౯ పేజీ) దౌహిత్రాభావ ఏవ పత్న్యా భర్తృదాహాది కర్తృత్వ మితివివేకః తదభావే దుహితా ఇతి॥ దౌహిత్రుఁడు లేనప్పుడె భార్యకు భర్తృదాహాది కర్తృత్వము కలదు. భార్యలేనప్పుడే కూతునకధికారమని నిర్ణయింపఁబడియె. దీనింబట్టి దౌహిత్రుడే ప్రధానమని యేల గ్రహింపరాదు ?

ఉ॥ తగినప్రమాణమును గనుపఱిచి యుండిన గ్రహింపవచ్చును. అట్టి ప్రమాణమును గనుపఱిచి యుండలేదు గాన గ్రహింపరాదు.

ప్ర॥ పుత్రః పౌత్రః ప్రపౌత్రశ్చ పుత్రికాపుత్రఏవచ। ఇతి ప్రపౌత్రానంతరం దౌహిత్రస్యైవ కర్తృత్వోక్తేరితి. పుత్రుఁడు- పౌత్రుఁడు- ప్రపౌత్రుఁడు- దౌహిత్రుఁడునని ప్రపౌత్రునికి వెంటనే దౌహిత్రుని గ్రహించినందున పత్నికంటె దౌహిత్రుడే ప్రధానమని ప్రమాణముం గనుపఱచెఁగదా

ఉ॥ వచనము వ్రాసినాఁడుకాని యిందగు పుత్రికాపుత్ర శబ్దమునకు నర్థనిర్ణయము చేయలేదు. ఎట్లన ఈపుత్రికాపుత్ర శబ్దమునకుఁ గృతపుత్రికా పుత్రుఁడని యర్థమా? లేక తదితరుఁడగు దౌహిత్రుఁడు మాత్రమే యని యర్థమా? ఇందు తదితరుఁడగు దౌహిత్రుఁడు మాత్రమేయని యర్థము చెప్పినను నాకుఁ గర్మముచేసి సాధనము గ్రహింపుమని మాతామహునిచే నియమము చేయఁబడిన దౌహిత్రుఁడొక్కఁడు. అట్లు నియమితుఁడుకాని వాఁడొక్కఁడు. వీరిలో నెవ్వని గ్రహింపవలయు? ఈవిమర్శ నెంతమాత్రము చేయక దీనింబట్టియే యందఱు దౌహిత్రులకు పత్న్యాదులకంటెం బ్రాధాన్యము నిర్ణయించినాఁడు. అనిర్ణీతార్థకమగుస్మృతివచనమునకర్థనిర్ణాయకత్వ మెక్కడిది? దీనింబట్టి యానిర్ణయము గ్రాహ్యముకాదు.

ఇచ్చట పుత్రికాపుత్ర శబ్దముచే కృతపుత్రికా పుత్రుని గ్రహింపక దౌహిత్రమాత్రుని గ్రహించినను సాధనమును గ్రహించి నాకుఁ గర్మముచేయుమని మాతామహునిచే నియమింపఁబడిన దౌహిత్రుని మాత్రము గ్రహించుట న్యాయ్యముకాని అనియమితుని గూడ గ్రహించుట యెంతమాత్రము న్యాయ్యముకాదు.

ప్ర॥ అట్లు గ్రహించుట యెందుచే న్యాయ్యముకాదు?

ఉ॥ దౌహిత్రుని విషయమై శాస్త్రము రెండు విధముల వచించుచున్నది. ఎట్లన:—భవిష్యత్పురాణమున "యథా పితుస్తోపిసుతః కుర్యాత్ప్రేతక్రియాంనృప। మాతామహస్య దౌహిత్రోఽపి తథాస్యాత్॥ గృహ్యావరిశిష్టేపి। పితామహస్యతత్పుత్రాన్య మాతామహ్యాన్యా తథైవచ॥

హితేశ్రాద్ధ నివృత్త్యై కర్తవ్యం పూర్వస్మి ముత్తరవిరతి॥ పత్న్యభావమందు దుహిత. దుహితృభావమందు దౌహిత్రుండును కర్మాధికారులనియు, ధనహారి యైనప్పుడే దౌహిత్రునకు మాతామహ కర్మ ఆవశ్యక మనియు, ధనహారిత్వమును బట్టియే కర్మాధికార మేర్పడుననియు సప్రమాణముగ సిద్ధాంతము చేయఁబడియున్నది. ఇట్టి నిర్ణయసింధువునకును విరుద్ధమనుట స్పష్టము.

8 ఇదిగాక యాజ్ఞవల్క్యస్మృతి దాయభాగ ప్రకరణమున పత్నీ దుహితరశ్చైవ పితరౌ భ్రాతరస్తథా । తత్సుతా గోత్రజాబంధు, శ్శిష్యస్స బ్రహ్మచారిణః॥ ఏషామభావే పూర్వస్య ధనభాగుత్తరోత్తరఇతి, అత్రవిజ్ఞానేశ్వరః॥ తస్మాదపుత్రస్య స్వర్యాతస్య విభక్తస్యాసంసృష్టినః పరిణీతా స్త్రీ సంయతా సకలమేవ ధనం గృహ్ణాతీతిస్థితం। తదభావే దుహితర ఇత్యాద్యుక్త్వా చ శబ్దాద్దుహిత్రభావే దౌహిత్రో ధనభాక్॥ మొదట పత్ని- పత్న్యభావమందు దుహిత- దుహితృభావమందు దౌహిత్రుండునని నిర్ణయింపఁబడియున్నది

ప్ర॥ ఇది దాయభాగ ప్రకరణము కావునను, ధనభాగుత్తరోత్తరః అను వాక్యమును బట్టియును, పత్నీ దుహితరశ్చైవ అను వచనము ధనము గ్రహించుటకు మాత్రే మధికారులను కనుపఱచినదిగాని కర్మాధికారులను నిరూపించుటకై వ్రాయఁబడినది కాదని యేల గ్రహింపఁగూడదు ?

ఉ॥ పత్నీ దుహితరశ్చైవ అను శ్లోకమునకుఁ బూర్వము ఔరసో ధర్మపత్నీజః తత్సమః పుత్రికాసుతః అని యారంభించి పిండదోంశహరశ్చైషాం పూర్వాభావేపరః పరః॥ మొద

టివాఁడు లేకున్న రెండవవాఁడు కర్మాధికారియు ధనము గ్రహించువాఁడు నగునని ధనభాక్త్వమునకుఁ గర్మాధికారమునకును పరస్పర సంబంధము కలిగి యున్నట్లు స్పష్టీకరింపఁబడియున్నది. కాబట్టి ధనభాక్త్వమును మాత్రము గూర్చియే యాజ్ఞవల్క్యస్మృతివచనములు ప్రవర్తించినవని యెంచఁగూడదు. కావుననే అపుత్రపౌత్ర సంతానే దౌహిత్రాధనమాప్నుయుః । పూర్వేషాంతు స్వధాకారే పౌత్రా దౌహిత్రకామతాః అను విష్ణుస్మృతియు॥ అకృతా వాకృతావాపి యం విందేత్సదృశాత్సుతం । పౌత్రీ మాతామహాస్తేన దద్యాత్పిండం హరేద్ధనమితి మనుస్మృతియును ధనభాక్త్వమునకుఁ గర్మాధికారమునకు సంబంధము కలిగి యున్నదనియే స్పష్టీకరించుచున్నవి. కాన పత్నీదుహితల కంటె దౌహిత్రుఁడే ప్రధానమనుటయు ధనము పత్నిని పొందినను కర్మాధికారము దౌహిత్రునిదేయనియు నిర్ణయించిన సుధీవిలోచన వచనము యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరీయమునకు, విష్ణుస్మృతికి, మనుస్మృతికిని గూడ విరుద్ధమై యున్నదని నిర్ధారిత మగుచున్నది.

ప్ర॥ సుధీవిలోచనము తక్కిన ధర్మశాస్త్రముల కన్నిటికిని విరుద్ధమై యగుగాక అయినను నదియే మాకుఁ బ్రమాణమని యేల తలఁపఁగూడదు?

ఉ॥ సుధీ విలోచనమునే ప్రమాణీకరింపుము. దానన్నబాధకములేదు గాని అందు "బ్రాహ్మణస్యోర్ధ్వ పుండ్రం స్యాత్ శూద్రస్యైవ త్రిపుండ్రకం" అని సిద్ధాంతము చేయంబడి యున్నది. అదియు నవలంబింపవలసి వచ్చునేమో?

నీకు వచ్చిన సుధీవిలోచనములోని నిర్ణయము తక్కిన

ధర్మశాస్త్రముల కన్నిటికి విరుద్ధమైయుండుటయే గాక సుధీవిలోచనములోని పూర్వోత్తర గ్రంథమునకుఁ గూడ విప్రతిషిద్ధమై యుండుట మహావిశేషమని గ్రహింపవలయు.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ పూర్వము "మాతామహనియమనేన ధనభాక్త్వేసతి తస్య తద్దాహాది కర్తృత్వోపపత్తేః పత్న్యాః పూర్వవిశేషో యుజ్యతే. ఏవంచ దౌహిత్రస్య మాతామహయోః స్సంస్కార వచన జాతం సంగచ్ఛతే॥ మాతామహుఁడు నియమించినందున దౌహిత్రునకు ధనభాక్త్వము కలుగఁగా వానికి మాతామహాది కర్మాధికారము సంభవించును గాన పత్నికంటెఁ బూర్వము దౌహిత్రుఁడు పరిగణింపఁబడియెననియు మాతామహులకు దౌహిత్రుఁడు కర్మము చేయవలయునని చెప్పు సకలవచనములకు నిదియె యభిప్రాయమనియు నిరూపింపఁబడి యున్నది. తరువాత మాతామహునిచే నియమింపఁ బడమిచే ధనము పత్నిని చెందినను దౌహిత్రునకుఁ గర్మము తప్పదని వచింపఁబడియున్నది. ఇది పూర్వనిర్ణయమున కెట్లువిరోధింపదు? కావునఁ బూర్వగ్రంథ విరుద్ధము.

ప్ర॥ ఇది ఉత్తరగ్రంథ విరుద్ధమనుట యెట్లు?

ఉ॥ సుధీవిలోచనము (౨౧౯ పేజీ) మూ॥ మాతామహేన మాతుస్సాపిండ్యే ధనహారి త్వేచ మాతామహ శ్రాద్ధం నిత్యం నాన్యథాకృతేఽభ్యుదయోఽకృతేన ప్రత్యవాయః॥ వ్యా॥ అత్ర విజ్ఞానేశ్వరః॥ వా॥ మాతామహేన మాతుస్సాపిండ్యే మాతామహ శ్రాద్ధం పితుశ్శ్రాద్ధవన్నిత్యమేవ।

పితామహ్యా పత్యావా మాతుస్సాపిండ్యే మాతామహ శ్రాద్ధ మనియతమేవ కృతేఽభ్యుదయః అకరణే న ప్రత్య వాయ ఇతి నిర్ణయః. ఇతి శ్రాద్ధం మాతామహానాంచ హ్యావశ్యం ధనహారిణా । దౌహిత్రేణ విధిజ్ఞేన కర్తవ్యం విధివత్సదా॥ ఇతి చ తస్మాత్ పితరో యత్ర పూజ్యన్తే తత్రమాతామహాఅపి । అవిశేషేణ కర్తవ్యం విశేషా న్నరకంవ్రజేత్ ఇత్యాది మాతామహశ్రాద్ధపరం వచనం తద్విషయమేవ॥ శ్లో॥ దౌహిత్రోహ్యఖిలంరిక్థ మపుత్రస్య పితుర్హరేత్ ॥ సఏవదద్యాద్ద్వౌపిండౌ పిత్రేమాతామహాయచ। ఇతివచన ముభయసంబంధి విషయం॥ ఇదమాహ॥

మూ॥ తత్ర పుత్రికాపుత్రో మాతృమాతామహ మాతృపితామహాన్ భోజయేదయంచోభయసంబంధో మాతామహస్య దర్శాదౌ పితుశ్చశ్రాద్ధం కుర్యాత్॥

వ్యా॥ అత్ర మాతృశ్రాద్ధే ఋష్యశృంగః॥ శ్లో॥ మాతుః ప్రథమతఃపిండం ప్రదద్యాత్పుత్రికాసుతః । ద్వితీయంతు పితుస్తస్యా స్తృతీయంతు పితుః పితుః॥ అపుత్రోహం ప్రదాస్యామి తుభ్యంకన్యాంభవానపి। పుత్రార్థీ చేదహం త్వస్నస్స నౌ పుత్రో భవేదితి ఇత్యుక్తోభయసంబధః పితృమాతామహయోరపి కుర్యాత్॥కార్ష్ణాజినిః॥ కుర్యాన్మాతామహశ్రాద్ధం నియమాత్పుత్రికాసుతః । ఉభయోరపి సంబంధే కుర్యాత్స ఉభయోరపి॥ స్కాందేచ॥ పార్వణంకురుతేయస్తు కేవలం పితృహేతుతః । మాతామహేన కురుతే పితృహాచోపజాయతే। యఃపుత్రికాపుత్ర ఇత్యర్థః॥ అతో మహాలయ దర్శమాసి శ్రాద్ధాదౌమాతామహశ్రాద్ధం చోభయసంబంధేనైవ కార్యమితిసిద్ధం॥ ఏత

దభావే ధనగ్రాహిణ పుత్రికాకరణ విరహేచ మాతామహశ్రాద్ధాకరణే దౌహిత్రస్య న దోషగంధః॥ఇతి. తల్లికి మాతామహునితో సాపిండ్యము చేసినప్పుడుగాని ధనహారిత్వము లభించినప్పుడుగాని దౌహిత్రునకు మాతామహశ్రాద్ధము నిత్యము. ఈ రెండును లేకున్న నిత్యము గాదు. చేసిన నభ్యుదయము. చేయకున్న ప్రత్యవాయము లేదు అని మూలగ్రంథాశయము.

దీనికి వ్యాఖ్యానము ఈవిషయమై మాతామహునితో తల్లికి సాపిండ్యము చేసియున్నయెడ దౌహిత్రునకు మాతామహశ్రాద్ధము పితృశ్రాద్ధమువలె నిత్యము లేనియెడ నియతము గాదు, చేయునెడ నభ్యుదయము లేకున్న ప్రత్యవాయము లేదని విజ్ఞానేశ్వరుఁడు నిర్ణయించెననియు ధనహారి యగు దౌహిత్రుఁడవశ్యముగా మాతామహులకు శ్రాద్ధముచేయ వలయుననియు రెండు విషయములకుఁ బ్రమాణములఁ గనుపఱచి పితరులేశ్రాద్ధమునఁ బూజింపఁబడుదురో అచ్చట మాతామహులును సమానముగఁ బూజింపఁ బడుదురనియు వారిలో భేదమునెంచిన నరకమును పొందునని మాతామహశ్రాద్ధమును విధించు వచనము తల్లికి మాతామహునితో సాపిండ్యము చేసిన వాని పరమైయుననియు కృతపుత్రికాపుత్రుఁ డుభయ సంబంధికావునఁ దన తల్లికి పితామహితోఁ గాని భర్తతోఁ గాని సాపిండ్యము చేయక మాతామహ మాతుఃపితామహులతోడనే సాపిండ్యము చేయవలయు ననియు సప్రమాణముగా వివరణముచేసి యిట్టి యుభయ సంబంధముగాని ధనగ్రహణముగాని లేనప్పుడు మాతామహ శ్రాద్ధము చేయకున్నయెడ దౌహిత్రునకు దోషము లేక

మైనను లేదని పరిష్కరింపఁ బడియున్నది.

ఈ రెండు విధములగు సంబంధములేని దౌహిత్రునకు మాతామహశ్రాద్ధమును నిర్బంధముగా నెడఁగట్టి యేది చేయలేదను నెపమున నతనికి బహిష్కారమును విధించుటకై ధర్మనిర్ణయ సభాధిపతిగారు వెదకి కనిపట్టిన మాతామహుఁడు నియమింపకున్నను ధనము పత్నికిఁ జెందినను గర్మకర్తృత్వము దౌహిత్రునకు తప్పదను నవాంతరవచనమును కృతపుత్రికా పుత్రత్వముచేఁ గలిగిన యుభయసంబంధముగాని ధనగ్రహణముగాని లేనప్పుడు మాతామహశ్రాద్ధము చేయకున్న యెడ దౌహిత్రునకు దోషము లేశమైన లేదను నుత్తరగ్రంథము విరోధించుట లేదా? కాఁబట్టి యీ సభాధిపతిగారు ముఖ్య ప్రమాణముగా గ్రహించిన "మాతామహేనానియమిత స్యాపి" అను సుధీవిలోచనములోని యవాంతర వచనము పూర్వోత్తర గ్రంథ విరుద్ధ మగుట తేట తెల్లము.

ఎట్లును తమ సిద్ధాంతము నిలుపవలెను నాశయముతో దౌహిత్రునకు ధనగ్రహణంబును కలదని యారోపించినారు. అది నిజమనినమ్ముటనే దౌహిత్రునకు కర్మాధికారము తప్పదని కొందఱు పండితులు తమ యభిప్రాయముల దెలిపి యుందురు. దుహితృపక్షమువారు దౌహిత్రుఁడు ధనము గ్రహించెననియు దౌహిత్రపక్షమువారు ధనమును గ్రహింపలేదనియుఁ జెప్పుచున్నారు. మాతామహి గతించినపిమ్మట ధనము గ్రహించినది లేనిది భగవంతునకే యెఱుక. ధనగ్రహణమే యున్న యెడ దౌహిత్రునకు కర్మాధికారము నిర్వివాదమే. దౌహిత్రుని ధనగ్రహణము నిశ్చితము కాలేదు.

సందిగ్ధమగు నంశమును బట్టి తీర్మానము చేయుట యన్యాయ్యము. ధర్మనిర్ణయ సభాధిపతిగారును దౌహిత్రుండు ధనము గ్రహించిన యంశము నెంతమాత్రము నమ్మనియట్లే ధ్రువపడుచున్నది.

వారికి ధనగ్రహణమునందే నమ్మకమున్నయెడ దౌహిత్రుండు ధనము గ్రహింపకున్నను కర్మము తప్పదను నపసిద్ధాంతము నవలంబించి ధర్మశాస్త్ర వచనముల కపార్థములు సాధించి న్యాయము తలక్రిందు చేయవలసిన గ్రాచారమేమి? ధనము గ్రహించిన దౌహిత్రునకు కర్మాధికారము నెడ ధర్మశాస్త్ర కర్తలందఱు నైకకంఠ్యము నవలంబించియే యున్నారుగాన ధనగ్రాహియగుటంజేసి దౌహిత్రుడు కర్మాధికారియని యొక్క మాటతోడనె" నిశ్చయము సేయనగుగదా? దీనింబట్టి ధనగ్రహణము లేకున్నను దౌహిత్రునకు కర్మము నంటగట్టుటకే సభాధిపతిగారింత శ్రమము వహించిరని స్పష్టపడుచున్నది. ఈపరిశ్రమమునుబట్టి తమకుంగల ధర్మశాస్త్ర పరిజ్ఞానమును పత్త్రికా గ్రాహకులందఱు గ్రహించి విభ్రాంతి నొందగలుగుటయు నవాంతర ఫలమునుగా వారెంచి యుండవచ్చును. ఇందుముఖ్యముగా గ్రహింపదగిన దేమందురేని.

సుధీవిలోచనములోని "మాతామహేనానియమితస్యాసి" యను నవాంతర వచనమును గ్రహించి మాతామహుండు నియమింపకున్నను ధనము పత్నిని జెందినను కర్మాధికారము దౌహిత్రునకేయని తాముచేసిన సిద్ధాంతమును ధర్మశాస్త్ర వచనములకు తాముచేసిన విపరీతార్థములను శాస్త్రీయములైనవానిగా సాధించుకొను నందాక ధర్మశాస్త్రముల జోలికి పండితుల జోలికిని రాకుందురుగాక !

ఇందువిషయమై తీర్పరివ్రాసినది కంటిరిగదా? సుకృత దుష్కృతములవలన నరులకుసుఖదుఃఖములుకలుగుచుండును. నరులు సుఖము కోరుదురుగాని దుఃఖము కోరరు. సుఖదుఃఖ దాయకములగు సుకృత దుష్కృతము లతీంద్రి విషయములు గాని ప్రత్యక్షములు కావు. కావున మనము సుఖము కోరుదు మేని దుష్కృతమును మాని సుకృతమును చేయుచుండ వలయు. ఇది సుకృతకర్మ ఇది దుష్కృతకర్మయని శాస్త్రము చెప్పిన మనము గ్రహింపవలయునేగాని మనకై మనము గ్రహింపజాలము. కావున మనశాస్త్రములు తల్లిదండ్రులకు వలెనె మాతామహునకు మాతామహికిని నవసాన కర్మములు విధిగాఁ జేయవలయుననియుఁ జేయనివాఁడు కర్మభ్రష్టుఁడగు ననియు నట్టి భ్రష్టునితో సకలసంబంధములు విడుచుకొన వలయుననియు, లేకున్న వానితోఁజేరిన వారుకూడఁ జెడుదు రనియు శాస్త్రములు చెప్పుచున్నవి. అని మొదలుగాగలదు. దీనిభావము గ్రహించితిరా?

ప్ర॥ ఏమని?

ఉ॥ దౌహిత్రుఁడు మాతామహులకుఁ గర్మము చేయవల యునని శాస్త్రములు విధించినవిగాన వాని నట్లుచేయని వారు వారితోఁ జేరినవారును భ్రష్టులేయగుదురనియు, వ్రాయుటచే తమ తీర్మానమునుబట్టి తంగిరాల శ్రీరాముల గారును ఆయనతోఁ జేరినవారును భ్రష్టులని తీర్పరుల యాశయమని స్పష్టమగుచున్నది. వీరందఱు శాస్త్రము నుల్లంఘించిన వారుగాన దుష్కృతాత్ములై దుఃఖములఁ బొందుదురనియు నుపక్రమమునుబట్టి విశదమగుచున్నది. శాస్త్రమునఁ జెప్పినట్లు నడువనివారి విషయమై యిది

యంతయు సర్వసమ్మతమే, కాని యిచ్చట నొక్క సంశయము కలిగెడిని. ఏమన?

ఇట్టి సుకృత దుష్కృతములు తీర్పరులకేమియు నుండవా? అట్లుండునెడ దుహిత కనంతరమే దౌహిత్రునకు శ్రాద్ధాధికారమును స్పష్టముగా సిద్ధాంతము చేసినవియు సుప్రసిద్ధములును మనదేశమున కనుష్ఠాపకములును నగు నిర్ణయసింధ్వాది నిబంధన గ్రంథములను ప్రస్తావములోనికి రానీకడాచి యప్రసిద్ధమగు సుధీవిలోచనమును సంపాదించి అందును పూర్వోత్తర గ్రంథ విరుద్ధమైనను తమకనుకూలమై యున్నదని యొక్క వాక్యమును గ్రహించి యిట్టి తీర్మానముచేయుదురా? అట్లు చేయుటకేదేని నొకపెద్ద కారణముండితీరును. అట్టి కారణము లేకున్న నిర్ణయ సింధువను నిబంధన గ్రంథమున్న సంగతి యీతీర్పరులకుఁ దెలియదా? తెలిసియున్నఁ జూడకుందురా? చూచునెడ నందు దౌహిత్రునికంటె దుహితకుఁ బ్రాధాన్యమనుట కనఁబడలేదా? కనఁబడిన దాని కర్థముకాలేదా? అర్థమేయయిన నది యుదాహరింపరా?

ప్ర॥ ఏలయుదాహరింపలేదు?

ఉ॥ తమ పక్షమునకు సాధకముకానందున, అంతియే కాదు, బాధకమే యయినందున ననవలయు.

ప్ర॥ తీర్పరికి సభాధ్యక్షునకు న్యాయాధికారికి పక్షపాతమేల? తమకు భాధకమని న్యాయ్యమును కప్పిపుచ్చుటేల? అని యడుగుదురా?

ఉ॥ అందునకు కారణమునుగూడ నేన చెప్పవలయునా? తీర్పునుబట్టి మీర యూహించుకొనుడు. ఇట్టి శాస్త్రీయమును కప్పిపెట్టి యశాస్త్రీయమే శాస్త్రీయమని మధ్యస్థులుతీర్మా

సము చేసినను చేయవచ్చునని వారికేదేని శాస్త్రము దొరికియుండనగు, లేనియెడ పాఠకులనిట్లు మోసపుత్తురా? మోసమున నింకెట్టిది ?

ఆహా ! ఏమి యీధర్మనిర్ణయ బద్ధకంకణత్వము ? ఏమి యీనిష్పక్షపాతధర్మసూక్ష్మనిశ్చాయకపీఠాధిరోహణ ధురీణత్వము ? భళీ! యిటులుండవలయు.

శ్రుతిధర్మముల సంజీవింపఁజేయు వ్రతము నవలంబించి ధర్మసంస్థాపనకై స్వమత సంఘమును లఘూకరించి పండితమండలిం దృణీకరించి విజృంభించిన మహావీరశిఖామణి సూక్ష్మదృష్టికి న్యాయ్యముగా దోచినసిద్ధాంతము సర్వధర్మశాస్త్రవిరుద్ధమైనను స్వప్రమాణీకృత పూర్వోత్తరగ్రంథ విరుద్ధమైనను పండితులెల్లరు శిరసావహింపనలసినదె. అట్లుగాక ఎవ్వండేని గ్రహాచారము చాలనివాఁడిది యేమనియడిగెనా ? వాని దుర్విధి సకలజన శోచనీయము కాకపోదని యెల్లరకు విశదమే.

మిత్రరత్నమా ? సుముఖుఁడ వగుము. లోకమునం బత్రికాధిపతుల నెందఱనో కంటిమిగాని నినుంబలె పత్రిక వలని మహాఫలంబులఁ గనిపట్టిన మతిమంతు నెందైనఁగంటిమే ? ధర్మము నధర్మముగను నధర్మమును ధర్మముగను బ్రకటింపనచ్చును. శాస్త్రీయము నశాస్త్రీయముగను నశాస్త్రీయమును శాస్త్రీయముగను సాధింపవచ్చు. మఱియు లోకోపకారులను జగద్ద్రోహులుగను మహాపండితులను మూర్ఖులుగను నిరూపింపవచ్చు. వేయేల! మహాత్ములనైనం దృణప్రాయులుగను చండాల సంసర్గయుతులనైన పరమపవిత్రులుగను నిర్ణయింపవచ్చు. నినువ్రేలంజూపువారెవ్వరు? నిన్నా

యుద్ధహస్తునిగా నెఱుంగని మూఢులునుంగలరా ? కాన యథేచ్ఛగాజయింపుము. లోకులునిన్ను ధర్మసంస్థాపనార్థమవ తరించినవానిగా విశ్వసించిరి. ఏమివ్రాసినను నిజమనియె యెంతురు. గ్రంథమంతట నేమి వ్రాసినను సరే ? కొనకు " సత్యమేవ జయతే నానృతమ్" అనివ్రాయునెడ నదివఱకు వ్రాసిన దంతయు సత్యమేయని నమ్ముదురు. పండితులు మానము వహించినవా ర్తిగ్రహించితివి. లోకులు కేవల మమాయకులని నిశ్చయించితివి. నిజమెవ్వరికిఁ గావలయు. నిజముగోరువా రుండనేయుండరు. ఉన్నను నల్పసంఖ్యాకులె.

అమేయభవదీయ వాఙ్మయ రసవిసర పరిసరంబునకు దక్క సొక్కనని వారెక్కడనేనిం జిక్కుదురె?

నీ శాస్త్ర గంధానభిజ్ఞతయు, నీసమాజ లోకప్రతారణ నిపుణిమంబును, నీవాచాలత్వంబును, వెలయించుచు " లజ్జా మేకాం పరిత్యజ్య సర్వత్ర విజయీభవేత్ " అనునార్యోక్తికి నిదర్శనమవై ముమ్మాటికిని జయింపుము. నీ నిరవధిక వాక్ప్ర పంచనంబునఁ బత్రిక నింపుము.

మ॥ ఇది శిష్యోదితధర్మకామియు సుధీ ష్మాత్తాప కృద్దంభకో
విదుఁడై మీాతెఱు యాజి పాంతిడిపసన్ విద్వన్మణుల్
గాంచి నే। మ్మది యాథార్థ్య మెఱింగి మెచ్చఁ
దగు ధర్మం బేర్పడన్ వ్రాసె
శ్రీ।ముదిగొండాన్వయ నాగలింగ
బుధుఁ డొప్పల్ చొప్పడం
జూపుచున్॥